# శ్రీ కూర్మావతార కథ

రచన:

రాష్ట్రభాషా ప్రవీణ

పాలావజ్ఝల రామారావు



శ్రీ కవితా పబ్లికేషన్స్

ఏలూరురోడ్ · విజయవాడ-2



శ్రీ కవితా ప్రచురణ

ముద్రణ మే, 1978.

వెల : 2-00



సంపాదకులు :

నెప్పల్లి త్రివిక్రమరావు.

ముద్రణ :

శ్రీ వెంకటరమణ

విజయవాడ - 520 002

సమర్పణము



శ్రీమన్నారాయణునకు

— పా॥ రామారావు

శ్రీ మాత్రే నమః

# శ్రీ కూర్మావతార కథ

వేదశాస్త్ర పురాణేతిహాస కోవిదుండగు వైశంపా యన మునీంద్రుండు హస్తిపురేంద్రుండగు జనమేజయ భూకాంతునకు శ్రీమన్నారాయణుని దశావతారములలోని మత్స్యావతార కథ కర్ణరసాయనంబుగ చెప్పె. య మ్మేదినీశ్వరుడు కోరగ న మ్మునిశేఖరుండు కూర్మావ తార కథ నిట్లు చెప్పదొడంగె:

## 1

"జనమేజయ మహారాజా! జగములను సృజింప బోషింప- సంహరింప జాలు త్రిమూర్తుల గని, పెంప జాలిన యనసూయాత్రులు జగత్త్రయమునందు నస్పృదశ మునిదంపతులు. ఆ పుణ్యదంపతులకు శివాంశమున దుర్వాస తపోధనాగ్రణి తనూజుడై బాలునివలె, నున్మత్తునివలె జగములందు జరించుచుండె.

అమ్మునీంద్రుం డొకనాడు కనకగిరితటమున

విహరించుచుండగ, నొక యద్భుతగంధము వచ్చెను. కొంచెము సాగిపోవగ హోమధూమ పావనంబగు నొక్క తపోవనంబు నాతడు గాంచెను. ఆ వనమందలి మేను లా తపోనిధిని జూచి శివుని జూచినట్లే భావించి మిగుల భక్తియొనర్పగ, వారిని గ్రేగంటజూచుచు న మ్మౌని యా పరిమళ హేతువు నారయుటకు సాగిపోవగ, నెదుట నత్యంత లావణ్యవతియగు నొక విద్యాధరయువతి కానుపించెను.

తన్నుగాంచి, యించుకేనియు జలింపని య మ్మునీంద్రుం జూచి, యా విద్యాధరి చేతి సంతానపుష్పమాల నొసపడ, గేలుమోడ్చి యెదుటనిల్చి "ఓ మునిసార్వభౌమ! తమ కీర్తిని దేవేంద్రాదులు సన్నుతించుదురు. అట్టి తమ సందర్శనభాగ్యము నా కబ్బె. తమకు వలసినచో, నీ సంతాన పుష్పదామమును దీసికొను" డని య మ్మునీంద్రున కీయగ, నత్యంత సంతోషంబున నతం డా దామంబును గ్రహించి, కన్నుల కద్దుకొని, వక్షంబు జేర్చి, కంఠమున వైచికొని చనుచుండెను.

చతురంగబల సమన్వితుడై, సాయుధులగు దేవ సేవ వెంటరా, నైరావతము నెక్కి దివితో వాహ్యాళి వెడలివచ్చు దేవేంద్రుని గాంచి, య ద్దుర్వాసమహాముని తన చేతి దివ్య పుష్పమాల నాతనిపై వేసెను. ఆ సురపతి య ద్దామంబును నిజకరంబున గ్రహించి, యైరా

వత కు ఢ స్తలమున నుంచె. అంత న మ్మాల యట నుండి జాఱి, క్రిందబడియె. దాని నా గజేంద్రము కాల మట్టగించె.

తానిచ్చిన సుమదామ మట్టి దుర్దశనొంద గాంచి, య మ్మునిరాజు కాముని హరించిన హరునిలీల నుగ్రుండై, కిటకట బండ్లుగీటి హుంకరించుచు "సురేశ్వర! నిన్నిక నేమనవచ్చు, నేనిచ్చిన సుమదామమును మహాప్రసాదమని గ్రహింపక, యైశ్వర్యగర్వంబున నాశమొందజేసితివి. నన్నెవ్వనిగ నెంచితివి? నా మహాత్త్వము జగజ్జేగీయమానము. నేను వసిష్ఠాదులవలె బరమ శాంతుడనని తలంచితివా? బ్రహ్మ హత్య, పరాంగనాసంగతి, జ్ఞాతివైరము, యజ్ఞవిఘ్నములు, అసూయ మున్నగు దుర్గుణములు గల నిన్నని ప్రయోజన మేమి? బ్రాహ్మణాపరాధము సహింపరానిది. కాన నీకు గల త్రైలోక్యలక్ష్మి నిన్నుబాసి యా శ్రీహరిని జేరుగాక" యని కఠినముగ శపించె.

వెంటనే దేవేంద్రు డైరావతము దిగ్గి, దుర్వాసుని పాదములపై వ్రాలి, స్వామీ! నేను మీ దాసుడ. నీ కటాక్షవీక్షణముల నన్ను బ్రోవు" మని వేడికొనగ, న మ్మునీంద్రుడు "దేవేంద్రా! నీ వెంత వేడికొనినను, నాకు దయరాదు. నీ చేసిన యవమతి మన్నింపను. గౌతమ, వసిష్ఠ, విశ్వామిత్రులవలె నీ తప్పులను మన్నింపను.

పీ సకలైశ్వర్యము క్షీరసముద్రముపాలగుగాక" మని పలికి, యి దుర్వాసమునీంద్రుం డుగ్రుడై, మండిపడుచు వెడలిపోయె. తండ్రి పరమ శాంతుడగు నత్రి. తల్లి మహాసాధ్వి యనసూయ. అనుజుడు చల్లని చంద్రుడు. ఇట్లయ్యును శివాంశ జన్ముడగు నమ్ముని యుగ్ర భావము విడువలేకుండెను.

అంత దేవేంద్రుడు తన తెలివిలేమికిని, దుర్వాసుని ముక్కోపంబునకు మిగుల చింతించుచు, నిజ పురంబునకు బోయెను. కాని మునిశాపము వ్యర్థముగ బోవునా? అతనికి నైరావతము, నుచ్చైశ్శ్రవము నారోహించుటకు లభించుటలేదు. సంగీతము పాడుటకు నచ్చరలు రారు నందవనమున గల్పవృక్షము లదృశ్యము మయ్యెను. కామధేనువు జాడ తెలియదు. కొల్వుకూటమున చింతామణీ భద్రపీఠము కానరాదు. ధనాగారము శూన్యమయ్యెను.

దిక్పాలకులు పనిగల్గి పిలువనంపినను వచ్చుట లేదు. సప్తర్షులు వచ్చి 'విజయోస్తని' దీవించుటలేదు. దేవసైనికులు తన కొలువు మాని వెడలిపోవుచుండిరి. అమరావతీ పౌరజనము భక్తియుక్తులై తన్ను సేవించుట మానిరి. తన భార్యయు బుత్త్రికయు దప్ప నితరులు లేరైరి. లక్ష్మీకటాక్షము లేకుండుటచే భువనములు క్షామమొందెను. భూలోకవాసులు సత్త్వహీనులై యజ్ఞ

యాగాది కర్మలు చేయకుండిరి. అత్తఱి దేవేంద్రాది బృందారక సమూహంబు ఆకట నకనకలాడుచు, నెల్లెడల గ్రుమ్మరుచుండిరి.

అపుడె యవసరమని మయ, జంభ, తారక, శుంభ, నిశుంభ, మహిష నముచిప్రముఖులగు దైత్యదానవులు వేలుపులపై దండెత్తిపోయిరి. అయ్యెడ త్రిమూర్తులు భయము నొందుచున్న తమ సతులకు ధైర్యము చెప్పుచుండిరి. దిగులుచే మూర్ఛనందిన శచీదేవికి దేవేంద్రుడు శైత్యోపచారములు చేయుచుండె. కిన్నెర గంధర్వాది దేవగణముల గతి యేమయ్యెనో తెలియదు. అట్టియెడ రథ గజ తురగ పదాతి సైన్యములతో బలిదైత్యేంద్రుడు మఱియొకవంక విజృంభించి వేల్పులపై దండెత్తి వచ్చెను.

అసుర రాజధాని బలిదానవేంద్రుని వశమయ్యెను. దేవతలందఱును పారిపోయి బ్రహ్మలోకంబు చేరుకొనిరి. అపుడు చతుర్ముఖుండు కనక మండపమున కొలువుదీరియుండగ, దిక్పాలకాది దేవతలు "స్వామీ! బలియొక్క విజృంభణము నణచి, కరుణతో మము రక్షింపు" మని వేడికొనిరి. బ్రహ్మ వారిపై గరుణించి, "దేవతలారా! దైత్యదానవులకు భయపడనేటికి? సరసముగ ముజ్జగంబులను బ్రోవగలవాడు శివుడు. ఆయన

కడకు బోవుద"మని యా దిక్పాలకాది దేవతలను వెంట బెట్టుకొని, కైలాసంబున జేగి, బలిదానవేంద్రుని వలన గలిగిన కష్టములు బాపి బ్రోచుటకు నమ్మహాదేవుని వేడికొనగ, నా హరు డొకించుక యాలోచించి చతురానన దిక్పాలాది యమరులతో గూడి ప్రమథగణములు పరివేష్టింపగ, క్షీరాబ్ధితీరము జేరెను.

హర బ్రహ్మాదులు "ఏది ప్రకృతివిహీన సచ్చిదానందమో, యేది జీవేశ్వరాఖ్యలతో వెలుంగునో, యేది యవిద్యయు, విద్యయు నుపాధియై వర్తించునో, యట్టి బ్రహ్మమును ప్రార్థించుచున్నాము. తత్త్వమస్యాది వేదాంత వాక్య వాచ్యార్థమైనవాడును, తన కమనన్నచే నీ చరాచరముల బుట్టించువాడును, వర యోగి హృదయముల బరంజ్యోతియైన వాడును, అఖిల జగద్రక్షణ హేతుభూతుడును, లక్ష్మీసమేతుడై క్షీరాబ్ధి మీద ఫణిరాజుపై బవ్వళించువాడును నగు శ్రీహరి మాకు సాక్షాత్కరించుగాత" మని ప్రార్థించిరి.

ఆ మరల మొఱ విని, కరుణామూర్తియగు శ్రీహరి ప్రత్యక్షమయ్యెను. ఆ దేవదేవునకు బ్రహ్మాదిసురలు సాష్టాంగనమస్కారము సేసి, సర్వానంద మగ్నులై నిలిచి యుండగ, శ్రీహరి వేల్పులజూచి తెలియనివానివలె వారి విచారహేతువునుగూర్చి యడిగెను. బ్రహ్మ "దేవా! బలిదైత్యుడు సురల బార

ద్రోలుటచే నా సృష్టికి గొంచెము కొరత యేర్పడె" ననెను.

దేవతలందఱు బలిదానవునివలన గలిగిన కష్టనష్టములను నద్దేవదేవునితో మనవి చేసికొనిరి. అంత దేవేంద్రుడు "స్వామి! దుర్వాస శాపవశమున నా సకలైశ్వర్యము నంబోధి జేరగ, శ్రీరహిత స్వర్గలోకమును బాలింపలేకుంటి" నని మనవి చేసికొనెను.

సురేంద్రుని పల్కులు విని శ్రీహరి "దేవేంద్రా వినుము. నా వక్షముననుండు శ్రీసతి నేడు కానుపింపదు. శ్రీసతీమణి మరల మనకు లభించుటకును దేవతలమరత్వము నొందుటకు నొక్క యుపాయ మాలోచించితిని. మందర పర్వతమును గవ్వముగను జేసి, వాసుకి సర్పరాజమును గవ్వపుత్రాడుగ జేసి యత్యధిక శక్తితో క్షీరజలనిధిని మథించినచో, నందుండి యమృతమును, లక్ష్మీ దేవియు, నైరావతాదులును లభించును. వేయేల, నీ పూర్వపు టైశ్వర్యమంతయు నిస్సంశయముగ లభించును. తఱువాత బలిదైత్యుని గెల్వవచ్చును. కాన వానితో సంధియొనర్చుకొను" మని యానతిచ్చి, కమలనాభుడు వైకుంఠమును జేరి, లక్ష్మీ విరహమున మిగుల దపించుచుండెను.

# 2

అనంతరము సురనాథుడు దేవాచార్యుడగు బృహస్పతికడకేగి యత్యంత వినయంబున న ద్దేవమంత్రికి నమస్కరించి. "గురూత్తమా! తమ యాశీర్వచన ప్రభావమున నేను దేవేంద్రపదవియం దుండగల్గితిని. తండ్రివలె మమ్ము బ్రోచుచుండుటవలన నీకు 'గురు' నామము సార్థకమయ్యె. దేవతాళికి జీవభూతుడవగుటచే నీకు జీవాఖ్యప్రసిద్ధము. నీ కటాక్షమున నేనెప్పుడు నే పరిభావమొందలేదు. కాని నేడు దురదృష్టవశమున నైశ్వర్యహీనుడనైతిని. బలిదైత్యనాథునితో సంధి యొనగూర్చుమా" యని వేడుకొనెను.

సురాచార్యు డొకింత యాలోచించి, బలిదానవేంద్రుని కొలువుకూటమునకు బోయి, యచట నున్న నారదునిమూలమున సభా ప్రవేశము నొందెను. దైత్యుల మనవి వినుచు, మునుల యాశీర్వాదములందుచు గానము చేయు గంధర్వులకు బహుమతుల నిచ్చుచు, నీకు హరి హరాదులతో బోర వశముగాదు మానుమనిన శుక్రచార్యు వచనములకు మాఱుపల్కక యుండి, "నారదా! దినంబునందలి వింతవార్తలేమని యడిగిన

బలిదానవేంద్రుని'' బృహస్పతి దీవించెను. బలి "సుర లోకాచార్య! యేమిపని" యని యడుగ, దానవేంద్రా! దివిజపతి నేడు నీతో సఖ్యము గోరుచున్నాడు. నీ వియ్య కొనిన, వృథా యుద్ధము నివారణమగు" నని బలుక. న బ్బలి "యెప్పుడు దేవేంద్రుడు నన్నవమానించె. అయినను. నన్నాతడికనైనను భక్తితో గొల్చినచో, నాతని మన్నింతు" ననెను.

అందులకు బృహస్పతి మిగుల సంతసించి, దేవేంద్రుని జేరి, జరిగిన విషయమునంతయు దెల్పి దేవేంద్రా! నీకు నచ్చినట్లు చేయుము. నీవు బలిదైత్యేం ద్రుని గొల్చుటకు సిద్ధపడి దేవలోకమునకు హితమొనర్పు రింపు. శరణన్నచో నిన్నాతడు మన్నించి 'నీతో సఖ్య భావము నెరపును. కావున నీ వవశ్యము బలిని భృత్య భావము సేవింపు'' మని హితవు చెప్పెను.

ఆ మాటలకు సమ్మతించి దేవేంద్రుడు దిగీశుల తోడను, దన బలముతోడను బోయి, శతాశ్వమేధావ భృధస్నాతపూతమగు తన మస్తకము బలిరాక్ష సేంద్రుని పదములపైనుంచి మ్రొక్కెను. అంతన బ్బలి చక్రవర్తి సింహాసనమునుండి డిగ్గనలేచి 'లే లె' మ్మని యమితోత్సాహముతో నాతని నెత్తెను. ఎత్తి. కౌగలించు కొని. "అన్నా! పెద్దవాడవు. నీవు నాకేల మ్రొక్కుదు" వని ప్రీతితో బల్కి, యతనిని దన సింహాసనము

ప్రక్కను నొక చిన్న గద్దెపై గూర్చుండబెట్టి "అమ్మ కుశలమా" యని బంధువులందరి క్షేమమడిగెను.

దేవేంద్రుడు 'వంశజులు క్షేమ' మని తెల్పి "నాకు మరాసిపనామమేల? నీవే యిలక రవై దైత్యుల నేలినట్లే యాదైత్యులను నేలుము. నేను నీకు భృత్యుడనై నీ నమ్మకమున్నాన నుందును" అనెను. అందుల కంగీకరించి, యద్దాన వేంద్రుండు దిక్పాలకులకు దగిన పనుల నప్ప గించి, వేలుపుల త్రోచెను. దేవేంద్రుడును సర్వకాల సర్వావస్థలయందు మిగుల భయభక్తులతో నబ్బలిదాన వేంద్రు గొల్చుచుండె. ఇట్లు నయమున దన్ను దేవేం ద్రుడు సేవించుచుండగ నా దానవనాథు డాతనిని నమ్మి యుండెను.

అంత నొకనాడు బలిదాన వేంద్రుండు సుము ఖుడై యున్న సమయము జూచి. దేవేంద్రుడాప్త మంత్రులతో నాలోచించి "బలిచక్రవర్తీ! యీ మహా వైభవము. నీ దురతి క్రమవిక్రమము నీకెగాక, త్రిజ గంబులందు నెంకైనను కలదా? ఇన్నియున్నను.మన కీ దేహము నిత్యముకాదు. ఎప్పుడో యాపదనొందును. వశించుము. క్షుత్పిపాసా జరావ్యాధులచే శుష్కించు నీ దేహమును మనము నమ్ముకొని యున్నాము. కాని మనకు మరణ మెప్పటికైనను దప్పదు. సర్వేంద్రియ ములు జరాభారముచే దుర్బలము లైనప్పుడు మనము

నిస్పృహోయులముకదా! శతవర్షములలో సర్వకాలమును నిద్రయే హరించు. దానిని మానుటవలన జాత్యము కల్గును. ఇట్టి దేహమువలన నెవ్వరికి సుఖంబులేదు. కాని యమృతరసపానంబు జేసిన, ని ద్దేహంబున కెట్టి నష్టకష్టంబులుండవు. కాన నట్టి యమృతరసంబు మందర పర్వతమును గవ్వముగను, వాసుకిని గవ్వపుం ద్రాడుగను జేసి, క్షీ రాంభోధిని మథించినచో నందుండి యమృతము లభించునని పూర్వ మొకప్పుడు హరి యానతిచ్చె'' నని నుడివెను.

# 3

అప్పలుకులకు మిగుల సంతసమంది, అట్లే చేయుదము. లభించిన యమృతమున నీ కధికభాగ మిత్తుము. ఆలసింపక తగిన యత్నము సేయుము మను దనుజుల పలుకులు, దేవతాపతిపలుకులు విని బలిచక్ర వర్తి క్షీరసాగర మథనమునకు సమ్మతించి, వారితో గూడి చతురంగ బలసమన్వితుండై వెడలి మందర పర్వ తమును జూచి, దేవేంద్రు డన్నగమహాత్త్వంబును వర్ణింప, బలి జిఱువవ్వు నవ్వి యతని చతురత్వమును గొనియాడి, గనత నా నగరాజంబును స్తుతించెను. అంత

వహించుచుంగడ నీ మందరము భూధర మెట్లయ్యె"
నని యలిగెనో యన్నట్లు, మిగుల గోపమునొంది,
యా న్నగమును జుట్టుకొని, తుంగశృంగాగ్రశోభిత
మగు నద్దానిని భీషణ ఘోషంబు గలుగగ బెకలించి
వేసెను.

అంత నా శ్మధరమును సురాసురులు పట్టి తల
కెత్తుకొనిరి. కాని య మ్మహాభరమును భరింపజాలక
వా రయ్యద్రిని దాని స్థానముననే గూలవైచిరి. అందు
వలన గొందఱు గాయపడిరి. అత్తఱి దేవేంద్రాది
సురలు చక్రిని ప్రార్థింపగ, భక్తవాత్సల్యమున న ద్దేవ
దేవుడు గరుడ వాహనారూఢుడై వడిగ నచటికి విచ్చే
సెను. అంత నా శ్రీహరి య మ్మందనగరంబును
జేతితో నెత్తి గరుడుని శిరమున నుంపగ, నా పక్షిరాజు
దాని నవలీలగ భరించి, వేగముగ నాకాశమార్గమున
బోవుచుండగ, నంతవేగముగ సురాసురులు బోవం
జాలక, గుడుతుల ప్రకారము వెనుక బోవుచుండిరి. గరు
డుడు నిమిషమాత్రమున క్షీరజలనిధి తటమును జేరి,
శ్రీహరిని, మందరనగరమును డించి, సురాసుర వీరుల
మెప్పులంది వెడలిపోయెను.

తరువాత వాసుదేవు నానతిని వాసవుడు సకల
దేవాసురావళికి సమ్మతముగ ననంతశక్తిమంతుడగు

వాసుకి సర్పరాజమును బిలువనంపెను. వాసుకి వచ్చినంతనే దేవేంద్రుడు "భుజగరాజా! నీవనంతశక్తుడవు. ప్రణయకలహామునందిన పార్వతిని, బరమేశ్వరునకు గూర్తువు. ఒక్కొక్కనాడు హరునకు గంఠహారమగుదువు. ఒక్కొకనాడా దేవదేవునకు హస్తకంకణమగుదువు. ఇట్లెన్నివిధములనో విశ్వేశ్వరునకు నీవు కూర్చువాడవు. అట్టి నిన్ను ప్రశంసింపగలనా? అమృతప్రాప్తికై మందరనగమున మేము క్షీరజలధి దరియింప బూనితిమి. నీవు కవ్వపుంద్రాటివై, శేషునిమించిన యశము బొందుమా" యని పల్కినంతనే వాసుకి సమ్మతించెను.

అంత దేవేంద్రుడు వజ్రాయుధమున మందరనగమును నిష్కంటకముగ జేసి, పార్శ్వగ్రావముల నఱికి, కవ్వముగ జేసె. అంత దేవాసురులు తమతమ కిరీటముల సర్దుకొనియు, కుండలాంగదముల పదిలముగ ధరించియు, నంగుళీయకముల నలంకరించుకొనియు, మౌక్తిక హారములను మట్టుపఱిచియు, చేలములు మొలదట్టి బిగియగట్టియు, నుత్సాహాతిశయమున నొకరినొకరు పిలిచికొనుచు క్షీరసాగరమును జేరి, వాసుకి నద్రిరాజమునకు జుట్టి, యా వింతకవ్వమును క్షీరాబ్ధియందుంచిరి. అంత దేవతల మనోగతాభిప్రాయములు దెలిసి, శ్రీహరి కపటమార్గమున వారుభయులకు

బోధించి. యా వాసుకి ఫణాగ్రభాగంబును దానవులును, బుచ్ఛభాగమును దేవతలును ధరించుటకును సమ్మతింప జేసెను.

# 4

అంత నా దేవాసురు లైకమత్యమున నమృతాబ్ధిని బటుబలతో మథింపసాగిరి. మందరనగము నాధారము లేనిదై నిరాధారమగుటచే నా మహా విశాల సముద్రమునందు మునిగిపోసాగెను. అట్టియెడ శ్రీహరి యభయప్రదాత గలవాడు గాన మిగుల విస్తారమగు కూర్మాకారమును ధరించెను. కఠినతరమైన కర్పరమును, మృదు జఠరమును, నయనాబ్జయుగమును గలిగి లోపలికి వెలుపలికి జలించునట్టి ముఖంబును గల యా మహా కూర్మావతారమును జూచి, దేవాసురులు మిగుల విస్మయమందుచు జూచుచుండిరి. ఆ సమయమున మంధరనగము క్షీరాబ్ధియందు గూర్మాసనమున గూర్చుండి, భోగిభోగమును యోగపట్టిక జేసి గగ నమృత సిద్ధికై జపియించునట్టి యోగిచందమున గన్పించెను.

దేవ దానవు లట్లు మంధరధరవసుంధరాధరంబును

వాసుకి యనెడు గుణానుబంధురముగ జేసి, సింధు వనెడు ఘటంబునందు కవ్వమై యుండునట్లు ప్రతిష్ఠించిరి. వార లుత్సాహంబున న య్యద్రిని వాసుకిగుణంబును బట్టి త్రిప్పుచుండగ నయ్యది యా క్షీరాబ్ధియందు గిర గిర తిరుగచుండె. మాధవుడు ఘనతర ప్రౌఢితో నా కులశైలము క్రింద, మీద, నడుమ కూర్మాది రూపము లతో నుండి, బలియుడై భరియించి దేవ దానవు లనెడు భూభాగములను నీటనుంచి, తన చతుర్బాహావు లను మార్చుకొనుచు, నా సముద్రమును మథించెను.

ఇవ్విధంబున దేవ దానవులచే శ్రీహరి క్షీర సముద్రమును మథింపజేయగ, వారలి కాంచనచేల హేమ కేయూరాదుల రజంబు రాలి పడి, యన్నగంబు బొమ్మ కనకాద్రి వలె నుండెను. ఆ సమయమున దేవ దానవుల యట్టహాసములును, మందరనగఘర్షణము వలని ధ్వనియు, వాసుకి భుజగేంద్రఫణ ఘూత్కారము లును, ఆ సముద్రమందలి జలచర ఘోషయును మెండై, బ్రహ్మాండమున నిండెను. క్షీరాబ్ధి యందు మందరనగము క్రింద నుండిన కూర్మ మా పర్వత భ్రమణముచే వెన్నుతీట శమియింపగ సుఖనిద్రనందె. వాసుకి భోగిఫణముల దంష్ట్రిలనుండి వెల్వడిన భయం కర విషానలంబున గవాగ్నిమగ్న శలభంబుల చందం బున, తెక్కు దానవులు గర్వంబు నశింపగ, మాడి

పోయిరి. ఆ వాసుకి ఫణిపుచ్ఛముకంటె శిరమును ధరించుటయే ఘనమని భావించిన దానవులకు ఎక్కు కష్టములు గల్గెను. ఆ విషవహ్నికీలలు సోకినను దేవతాళి శ్రీహరి కరుణాకటాక్ష వీక్షణములచే సుఖముండిరి. కాని దైత్యులు కష్టముల లెక్కింపక ఫలాకాంక్షతో నెక్కుడుగ మథించుచుండిరి.

తరువాత వాసుకి భోగందష్ట్రిలనుండి వెల్వడిన విషము శైలవిఘర్షణముచేతను కూర్మకర్పర ఘర్షణాగ్ని జ్వాలల చేతను మిగుల భయంకరమైనదై, దేవ దానవ గణము భీతిలునట్లు క్షీరాబ్ధినుండి వెలువడి, ప్రళయకాల ఫాలలోచనాగ్నిని మించినదై, సంవత్సరమయమందలి సూర్యకిరణాగ్నిని నతిక్రమించినదై. యతిదారుణంబై, కోలాహలంబుగ నా హాలాహలంబు దశదిశల వ్యాపించుచుండెను. అమృతమునకై మథింపగ, ఘోర హాలాహలము ప్రాప్తించెనేమి యని భయమంది. యా దేవాసురులు విశ్వపతియగు నీశ్వరు శరణుజొచ్చిరి.అంత నా చంద్రశేఖరుడు వారిభయమెల్ల వారింప దలచి, తనకు నాపద సంభవించునని భయపడు పార్వతీదేవికి ధైర్యముజెప్పి, సర్వలోకాళి క్షేమమును గోరి, పరుల బీడించుకంటె బాపంబును, పరోపకృతికంటె బుణ్యంబును లేదని పల్కియు, భయంపడియుండగ, బ్రహ్మాది సురలు భయార్తులై తన్ను ప్రార్థింపగ

శ్రీహరి యా విషమును భక్షించి, నీలదేహుడయ్యెను. అంత శ్రీహరి మిగిలిన హాలాహలమును హరునకీయ, న ద్దేవదేవుడు దానిని గళంబున నిల్పె. ఇంకను మిగిలిన విషమును వృశ్చిక దంశ శూకములు మెసవి. విషధరములయ్యె. ఇట్లు దైవానుగ్రహంబున హాలాహల భయదూరులై దేవాసురులు మఱల క్షీరసాగరమును మథింపసాగిరి.

అట్లు దేవ దానవు లింకను క్షీరసాగరమును మథింపగ, నందుండి సర్వ శుభలక్షణములతో గూడి నట్టియు, భక్తుల కామ్యములు దీర్చునట్టియు కామధేనువు పుట్టెను. ఆ దివ్య ధేనువును శ్రీహరికృపచే దేవర్షులొందిరి.

అంత నా పాలసంద్రంబునుండి యుచ్చైశ్శ్రవమగు వెల్లివాజము నేత్రపర్వముగ వెలవడెను. అయ్యశ్వము దేవమణియుక్తమని యెఱిగి పూర్వ దిగధిపతియగు నింద్రుడు దానిని గ్రహించె.

తదుపరి యా క్షీరసాగరమునుండి చౌదంతియును, సర్వ శుభలక్షణయుక్తమును వెల్లనిదియు నగు నైరావతంబను గజరాజము వెలవడె. దానిని దేవేంద్రుడు సేకరించె.

మఱల నా దేవ దానవులు క్షీరాబ్ధిని మథింపగ నందుండి హరిచందన, కల్పన, పారిజాత, సంతానక,

మందార వృక్షములను సకలేప్సితములం నొసంగు పంచామర తరువు లుదయించె.

పదునపడి యా క్షీరసముద్రమునుండి సర్వాంగ సుందరీ మణులను సహజ సౌందర్య సుస్వర రూప గుణంబులు గల యప్సరసలు వెడలివచ్చిరి. వారందఱును సౌందర్యమున రతిదేవిని బోలువారు. కౌదము రాయంచలవలెను, రాచిలుకల మాడ్కిం, క్రొమ్మెరుగుల రీతి, జీవరత్నంబులభాతి, నా యచ్చర చిలుకకొలుకు లెంతయు నొప్పియుండిరి.

ఆ యప్సరల యందమునందె చూపు నిల్పి దేవదానవులు వారి మెప్పులకై నత్యంతోత్సాహంబున నుదగ్రరవం బతిశయింప నా క్షీరసాగరము మథింపగ, వెన్న ముద్దను బోలి చంద్రుడు పుదయింపగ, శివుడతని నిజశిరంబున ధరియించె.

అంత నా క్షీరాబ్ధియందు దేదీప్యమానమగు కౌస్తుభరత్నము భాస్కరునికిం జనించెను. దానిని శ్రీహరి నొసంగిరి.

అనంతర మమృతమును ద్రావు నీలమేఘమో, మఱి యొక చంద్రుడో, జలధి బుట్టిన పూర్వజలధియో యనునట్లు మిగుల నొప్పు నతుల శృంగారవతి యగు లక్ష్మీదేవి యుదయించెను. ఆ దేవి కానుపించినంతనే దేవ దానవులు చిత్రత నొందిరి. ఆమె సోయగములను

జూచుటకు వారు సహస్రనేత్రముల గోరిరి. కాని సహస్రాక్షుడు పదివేలకన్నుల కోరెను. ఆహా! ఆశకు మేర లేదనుట సత్యమే కదా! అంత నవ్వధూటి పద్మగర్భాదులగు నిర్జరులచే బ్రార్థింపబడి దేవాధినాథునిచే గల్పింపబడిన మణిపీఠమున గమలమధ్యమున జెలువందు కలహంసను పరిహసించుచు వసించెను. అప్పుడు పద్మభవుడు 'పుణ్యాహ' మనుచు భూమిని పుణ్యాహము చేసె.

పటహ భేరీ శంఖ పణవాది వాద్యములు మ్రోయగ, అప్సరోభామిను లభినయించుచు నృత్యంబు సలుపగ, గంధర్వ కలకంఠకంఠులు మోళ్ళు చిగురింప నమృతగానంబు సేయ, 'జయ లోకపావని, జయ జగజ్జనయిత్రి, జయ లక్ష్మి' యని సురలు సన్నుతింపగ, దక్షిణావర్తశంఖములతో గంగాది పుణ్య నదీజలముల దెచ్చి, యాగచోదితములగు మంత్ర రహస్యములతో బ్రహ్మర్షులు పద్మనభిషేకించిరి. దిగ్గజములు మహనీయ తోయములతో నా లక్ష్మీదేవి శిరముపై నభిషేకించెను.

శైవాలవల్లికాజలధి యిచ్చిన పద్మ పట్టుపుట్టము లను నా దేవికి యొక పడతి కట్టెను. సర్పరాజొసంగిన కురువింద మాణిక్యకుండలమ్ముల నామెకు నొక యువతి పెట్టెను. సరస్వతీదేవి యొసగిన యమల తార

కారమును యొక నాతి యామెకు గంఠహారముగ నలంకరించెను. సముద్రుఁ డొసగిన వైజయంతీమాల నొక పడతి యామె కంఠమున ధరింపఁజేసెను. విశ్వకర్మ సమర్పించిన వివిధ రత్నభూషణముల నామె నొక నాతి యామెచేతఁగీలించె. ఈరీతిగ సర్వాలంకార విభూషితయై యా లక్ష్మీదేవి జగన్మోహినియై బంగారపు బొమ్మయా యనున ట్లొప్పుచుండెను.

అప్పుడు 'జయజయ' యనుచు బ్రహ్మర్షులు దీవించిరి. శివ బ్రహ్మేంద్ర కుబేరాది దిక్పాలముఖ్య సర్వసుపర్వులు నుతించిరి. అట్లు నుతింపఁబడుచు, రమాకాంతాలలామంబు భద్రపీఠమందు విలసిల్లె. నిజకిరీటాగ్ర మరకతమణిరుచులతోను, వాలుజూపులతోను, ఆణిముత్యాల సరులతోను, కంఠహారములతోను, సింహాసనమున లక్ష్మీదేవి మిగుల నొప్పుచుండెను.

సకల దేవతల సర్వగుణంబులు గల్గి లోకనాయకు హృదయంబున నివ్వెరపడుచు, నాయిందిరారమణీలలామ సురముఖ్యుల గన్గొని మణికిరీటమును, మకరకుండలములును, చక్రమును, స్మితాస్యంబును, కంబుకంఠమును గరుడవాహనమును కలిగి, శత్రుంజయుడును, త్రైలోక్యనాథుండును నగు శ్రీహరిని ముదంబున సరసంబుగ వీక్షించెను కమలాక్షుని మనోహరాకారంబు

ధ్యానమున జూచి, యోగీంద్రులే మోహమునొందగ, లక్ష్మీరమణీమణి యద్దేవదేవుని బ్రేమించిన వింత యేమి?

కమలనయను వీక్షించినంతనే రమాదేవికి శరీరమున బులకలొదవెను. మేను చెమర్చెను. వామోరువు స్పందించెను. సంతోషాశ్రువులు జనించె. సరస్వతిదేవి కైదండ యొసగగ. పద్మపీఠము దిగ్గి లక్ష్మీదేవి శ్రీహరి పరమ సాత్త్విక దృష్టిసంపర్కమున సాత్త్వికోదయము నొందు నాశ్చర్యమేమి? దిక్పాల కాంతామణులు క్రమముగ నద్దపంబు, గిండి, పావన కుంభె, కాళాంజి, పాద్రమాణిధూపంబు, చామరములు చేకొని యా లక్ష్మీ వనితామణికి యూడిగంబులు చేయుచుండిరి. రంభా, మేన, కోర్వశీ, హరిణి, తిలోత్తమాది దేవవేశ్యలు చెంగుపాంగంబు, ముఖవీణ, మురజము మొదలుగా గలవాని గొని గంధర్వమేళంబు పనిచేయుచుండిరి. అబ్జభవురాణి వాగ్దేవి బిరుదుపద్యములు చదువుచుండె. ఇట్లు సకల వైభవంబు లమర, కలిమి చెలువ వల్లి గల్వ పూదండ కేలబూని ఠీవిమీఱంగ వచ్చుచుండెను.

ఆమెను జూచి కమలాక్షుడు పులకలొదవ, నానంద బాష్పములొందెను. ఆ రమాకాంతామణి సౌందర్యము వేవిధముల నిచ్చమెచ్చెను. ఈసుందరి నన్ను జేరిన,

నింక నెవ్వరిన్ స్మరింపక, ముదంబుమీఱ నుండు నను చు, మిగుల ననురాగమునొందెను. శ్రీహరిని జూచువలెనని కోరి, యా రమావనితామణి తెప్పలెత్తును. గాని గొంకున తెప్పలు వ్రాల్చును. హరిని జూచుటకు నా నారియు, నా నారిని జూచుటకు నాశౌరియు గొంకు చుండిరి. అంత మందగమనమున సిగ్గు మరికొంత మాంద్యమును గూర్పగ, భారతి కరమును వీడి, భయ వినయములొప్ప, నాలక్ష్మిసుందరి వారిజాక్షుని సముఖము నకు వచ్చెను. అంత నామె నిజకరంబుల పడంక, బ్రగాశమాన నీలోత్పలదామమును బద్మోదరుని కంబుగ్రీవమందుంచెను. పురంధ్రీరత్నము లట జేరి గౌరికల్యాణపదాలు పాడగ, పటహభేరీశంఖములు మ్రోయగ, శ్రీహరి యుప్పొంగగ, లక్ష్మీకల్యాణ మహోత్సవంబు చెలంగెను.

కమనీయ కౌస్తుభరత్నము గృహదీపకలిక నుశ్రీవహింపగ, పావన వైజయంతీవనమాలిక కేళికా డోలిక లీలజూపగ, తారహారములు ముక్తామయ రంగ వల్లికల విభ్రమముజూపగ, సురభి కస్తూరికాలిప్త హరి భుజాంతరాళమనెడి యింద్రనీల మణిమందిరమున క్షీరాబ్ధికన్యయగు లక్ష్మీదేవి సంతోషమున నుండెను. లోకాధీశుడగు కమలాక్షుని పరిరంభణమున నాజలధి కన్యాలలామ యత్యంత శోభాయుక్తముగ నొప్పె

యుండెను. ఇట్లు లక్ష్మీదేవి తనయురమున జేరినపుడె క్షీరసాగరమథన ప్రయాసమును శ్రీహరి మఱచి పోయెను. నేటికిని గార్యము సఫలమైనంతనే పూర్వ ప్రయాసమును మఱచిపోవుచుందుముగదా! ఈవిధముగ సకల జగజ్జనకుడగు శ్రీహరి నిజవిపుల బాహాంతర మున సర్వలోకైక మాతయగు శ్రీదేవి చేరియుండగ. దా గన్నబిడ్డరీతి, ప్రజల గనుగొనె. శ్రీదేవియొక్క కరుణా కటాక్షవీక్షణములు దేవసమూహముపై ప్రసరిం చెను. అమ్మహాదేవి కృపామృతవృష్టి లభించుటచే జనులదారిద్ర్య తాపంబు శాంతమయ్యెను. సర్వజాతులు నామోదమంది చెలెగె. విప్రసమూహంబు యజ్ఞతత్ప రమయ్యె.

తదనంతరం బనిమిషనేత్రులు రాక్షసులగూడి కలశజలధిని మఱల మథియింపసాగిరి. దేవాసురులు మేరమీఱి తన్ను మథించి. తన సర్వస్వమును హరింప దొడిగిరే యని వాపోవునట్లు క్షీరాబ్ధి గల్లోలములు మ్రోసెను. వాసుకి భుజగేంద్ర భూరిభూత్కారములు విశేషముగ ప్రసారమయ్యె. అంత నందుండి. తన గంధాఘ్రాణముననే దేవ దానవులు మత్తుహొందగ,మదిర వెలువడె దానిని మిగుల గుత్సాహమున నసురవ్రజము తీసికొనెను.

పిమ్మట న జ్జలధినుండి. ప్రజల తల్లి యనదగిన

హరీతకిని గుడిచేతియందును వ్రణ దుష్టరక్తమును బీల్చివేయుగల జలగ యెడమచేతియందును నొందు పఱచి, రమణీయమగు నవ సుధాపూర్ణకుంభమును నెడమచేతియందు బెట్టుకొని, యఖిల దేవశ్రేణికై యభయహస్తమును జూపి, కనకవస్త్రా ద్యలంకారములు, తామరసదళనేత్రములు, నసితాంగ సౌకుమార్యము, నమృతగుణాధికమునే యుంచు ధన్వంతరి యచ్యుతాంశమున జనించె.

అద్ధన్వంతరిచేతి యమృతభాండమును విప్రజిత్తి బలాఢ్యుడై హరింపగ, దాని నక్షీణబలుడగు జంభుడపహరించె. కాని దాని నిబ్బలుడు తీసికొనియె. అది చూచి, మనతో గలసి మథించిన దేవతల కీయక యమృతమును మనమే తీసికొనవ న్యాయముకాదని కొందఱును, నమృతము గొన్న మనలతో త్రిదశులు కలహింపక మానరని కొందఱును, వారికిని మనకును దీనికై యుద్ధమే జరిగినచో, నమృత మెవ్వరికిని దక్కదని కొందఱును, నెందాక గొనిపోవుదువు నిప్పు డ్రావనిత్తుమే యని కొందఱును, వలదు. ఈ యమృతభాండమును మన బలిచక్రవర్తికిచ్చినచో, నతడు పంచి యిచ్చినట్లు మనము తీసికొను టర్హమని కొందఱును రాక్షసులు వివిధ గతుల బల్కిరి.

# 5

పుణ్యజనులు హరించిన యమృతభాండమును దీసికొనజాలక దేవేంద్రాది మహాశనులగు సురలు "మహాకష్టము వచ్చె"నని మొఱపెట్టగ శ్రీహరి "భయం పడకు"డని ధైర్యము చెప్పి. దైత్యులను వంచనసేయ దలచి. యందమగు రూపమును. ముద్దుగారు పలుకులను. క్రొమ్మించు దేహకాంతులను. తళుకుం జెక్కులు. మందహాసముల. కెంపునెమ్మోవియు. చెవకుంజూపులను. శోభిల్లగ నత్యంత లీలావిలాసముతో జగన్మోహినీ యవతారము బూని. దైత్యులు వింతగా జూచుచుండగ వారిదరికి వచ్చెను. అందమగు ముంగురులను. చిమ్మెడచెఱగును. లేగౌనును. నడకయు నొప్పగ, పుష్పభరమున నునుగప్పుకొప్పు మెరయగ. సిగ్గుతో గూడిన వాల్చూపు చెవకుజూపగ. మందహాసముతో దైత్యసభకు యా జగన్మోహిని వచ్చినంతనే యామె చెలువగు మధ్యము బలిచక్రవర్తియొక్క మనస్సు నపహరించెను. ఆమె చూపు బాణుని మోహమున ముంచెను. ఆమె కనుగవ శంబరుని హృదయమును హరించెను. ఆమె కుచద్వయము జంభుని ముగ్ధుని జేసెను. ఆమె వెఱివేఱి రాహువునకు విభ్రమము గలిగించెను. ఆమె సౌకుమార్యము విరోచనునకు గనులపంట వచ్చెను.

లచే సంకేతములు తెల్పునటుచికి నామె యింపుగ గను బొమ లెగయఁజేయు. బలిసాపేక్షముగ జూచి నామె పయ్యెద సవరించుకొనును. ఆమె యొకయెడ నిల్చును. ఒకనితో మంతనముగోరు, ఒకనిని జేసన్న బిలుచును. ఒకని సరసోక్తులకు మెచ్చును. ఒకరిని రాచుకొని పోవును. ఒకనిని బిలుచును. ఇట్లమ్మోహిసికాంత యసురులను సమ్మోహితుల జేయుచుండెను.

అజ్జగన్మోహినియొక్క కీలుజడయు, నెమ్మొగమును మోవియును, సన్నని కౌనును, దైత్యశ్రేష్ఠులకు మిక్కుటమగు మోహమును గల్గింపగ, రాజసము వీడి తామసమున దపించి, సాత్త్వికమున మోహము దలకెక్కగ మిగుల గలతనొందిరి.

ఆ జగన్మోహనాంగిని జూచి, దైత్యవల్లభుడగు బలి చక్రవర్తి "యిట్టి జగన్మోహనసుందరిని సృజించిన బ్రహ్మను మెచ్చి, చేతికి బిరుదు వేయవచ్చును. ఈ నాతి కొమ్మమాత్రగాదు. ముద్దుగుమ్మ. నడయాడు బంగారుబొమ్మ. ఇట్టియువిదటాక్ష మెవనిపై బడునో వాడ కృతార్థుడు. ఈ సుందరి మన్మథుని పట్టపురాణియగై యందరి మనస్సులను గలచి వేయుచున్నది. ఈమె బంగారుబొమ్మయై యాశను గల్పించుచున్నది. ఈమె కళ లను బొందిన లతయై నేత్రానందమును గూర్చుచున్నది. ఈ

నాతి మన్మథబాణమై, హృదయమున నాటుకొని యున్నది" యని తెప్పవేయక చూచుచుండెను

"ఈ గజరాజగమన శృంగారముఁగాంచిన కన్నులే కన్నులు. ఈ జలజాక్షి మధురభాషణములు వినిన కర్ణములే కర్ణములు ఇవ్వారిబోడి మధురాధరంబాను జిహ్వయే జిహ్వ. ఇచ్చెలి చెక్కిళ్ళయందలి ఘనసార మాఘ్రాణించు నాసికయే నాసిక. ఈ సుందరిని గౌగిలించుకొనిన దేహమే దేహము. లేనిచో పంచేంద్రియములు నిష్ఫలము" లనియును.

"ఆహా! ఈ మనోహరి విలాసములు జూడగల్గితిని. చక్కెరలొల్కు పల్కులు వినగలిగితి. కాని ఈ నాతి మధురాధర మానుటయు. చెక్కుటద్దములు ముద్దుగొనుటయు, మనోహర కుచముల గౌగిట జేర్చుటయు నికెప్పుడు లభించునో? ఈ జగన్మోహిని యెదపై నెప్పుడు పవ్వళింపగలనో? ఈమెను రమించుచు, రతికూజితముల నెప్పుడు వినగలనో?" యని యుత్సహించి యొక నెపమున నా సుందరి ముద్దుమాటలు వినగోరి, యా బలిదానవేంద్రు డామెను సమీపించి, సుదతీ! నీ వెవ్వరిదానవు? నీ నివాస మెచ్చట? నీ నామమెద్ది? నీకీ భువనైక మోహనరూపమును పరమేష్ఠి మమ్ముల నానందింప జేయుటకు సృష్టించెనా? అటుగానిచో

కిన్నర, విద్యాధర, నాగ, కింపురుష, గంధర్వాది నానా విధ తరుణీమణులలో నెవ్వరికైన నీ సౌందర్యము వంటి సౌందర్యము కలదా? తరుణీ! నిన్ను మొదటనే చూచియున్నచో, మే మీ సముద్రమథనమునకు బూను కొనియుండెడివారము కాము. నా మనస్సు నీపై లగ్న మైనది.

లలనా! పాలకడలిని జిలుకగా నబ్బిన సుధను దైత్యసురలము మేము పంచుకొనలేక యున్నాము. కశ్యపుని సంతాన మగుటచే మే ముభయులము దాయా దులము. కాన నీవు మా కుభయులకు నీ యమృత మును సమముగ బంచియిమ్ము. అట్టి నేర్పుగలదానవె నీవు.

సుందరీ! నీ యధరామృతమున కాశింపక యీ యమృతమున కాశించితినని నను జాలకనసేయకు కోటి జన్మములందు జేసిన తపఃఫలమునగాని నీవు లభింపవు గదా! నీవీ యమృతకలశమును ధరించినతరి నీ మధురాధరంబు నందలి యొక తేనెబొట్టునైన నీ యమృతమున జిందినచో, నిది మాధుర్యమును గలిగి, యిప్పటి యఖిల గణ్యమును బుణ్యము నౌనుగదా!" యని వేడుకొనెను.

బలిచక్రవర్తియొక్క యీపలుకులు విని యాజగ న్మోహినీసుందరి కలకంఠీ కలనాదమొప్ప గంభీరముగ

ప్రోత్సు విగుచున్నట్లు "దానవేంద్రా! అబలనగు నేని కార్యము జేయగలనా? స్త్రీలను నమ్మరాదందురు కాని నన్ను నమ్మినచో నందఱను మేలొనరింపగలను. సౌందర్యము, రతిశక్తి, జాణతనంబు గల నే నెక్కడుందునని చెప్పుదును? స్త్రీలకు గుటిలత్వము కుంతలంబులందేగాని భావములందును, గాఠిన్యము కుచములందే గాక హృదయమందును, మాలిన్యము కీలుకొప్పునందే గాక బుద్ధిమార్గమునందును, చాంచల్యము చూపులందే కాక మోహంబులందును నుండును. త్రికరణశుద్ధి లేకుండుట స్త్రీలకు సహజముకదా! అట్టిచో నన్నెట్లు నమ్మగలవు? ఐనను స్త్రీ సామాన్యలక్షణములు నాకులేవు. నా గుణములు ముందు నీకే తెలియునులే. నేను పుణ్యజనులందు లీనమై యుందును. నాకు గర్తలేదు. స్వేచ్ఛంద వృత్తి నుండును" నని నుడివెను.

అప్పలుకులు విని దైత్యేంద్రుడు "లలనా! నేను నిన్నే నమ్మితిని. నీ చిత్తము. నా భాగ్యము. నీట ముంచినను పాలముంచినను నీవే. మఱి యితరము నెఱుగ" నని పల్కి యమృతభాండమును నా జగన్మోహిని చేతికిచ్చి, యామె కరస్పర్శంబున నమందానందంబు నొందెను.

# ౬

అప్పుడా మాయానారాయణి మృదుమధురవచనములతో "రక్కసులార! క్షీరసముద్రమును మధింపగ, లభించిన యమృతమును శ్రమపడిన మీరును, దేవతలును సమముగ నొందుట ధర్మము. నే నట్లు మీ యుభయులకు బంచుటకు మీ ప్రభుని కోరికపై సిద్ధపడితిని. ఇది మీ కిష్టమే కదా! తరువాత నెవరును నెట్లు నసంతృప్తి నొందరా"దని యడిగెను. అందులకు దేవ దానవులు సంతోషస్వాంతులై సమ్మతించిరి.

అంత గురు శుక్రాచార్యులు సంకల్పము జెప్పగ, కలశాబ్ధియందు స్నానమాచరించి, పంచామరతరువు లిచ్చిన సువర్ణ వస్త్ర మణిభూషణ పుష్పాదుల నలంకరించుకొని, యుపవసించి, హోమములుచేసి, దానధర్మములు చేసి, సకలాలంకార సుందరంబును, పంచమహా వాద్యములచే శోభితంబును నగు కనక మంటపము నందు బంతులుదీరి దేవ దానవులు కూర్చుండిరి.

అంత సర్వాలంకారశోభితయగు నా జగన్మోహిని యమృతకలశంబు దీసికొని, పిశాచరు లామె భువనైక సౌందర్యమునకు దబ్బిబ్బుగాగ, నొయ్యారంబుగ నడచుచు నా మంటపమునకు వచ్చెను. బలిదానవేంద్రుని సరసోక్తులకు నుచిత సమాధానములిచ్చుచు, నా

జగదేక సుందరి దానవులకు సమ్మతంబుగ త్రిదశుల పంక్తి జేరివచ్చి, యింద్రాది దిక్పాలురను, గరుడ గంధర్వ కిన్నర ఖచర సిద్ధ సాధ్య విద్యాధరాది నిర్జర కులములవారిని సర్వేరుబంతిగ నేర్పరిచి, దేవేంద్రుడాదిగ నమరుల కింపటికిని జగదేక మోహనముగ నమృతమును వడ్డించుచుండెను. బలిముఖాది దైత్యులు త్వర పడుచుండగ, నామె వారిని బరిహాసవాక్యముల సమాధాన పఱచుచు, నమరులకు సుధ నొసంగుచుండ, దాశలేక రాహువు దేవరూపంబు దాల్చి, యమరులలో గూర్చుండగ, నామె యాతనికి గొంత యమృతము నొసంగె. కాని సూర్యచంద్రులు 'వాడు రాహు వను దైత్యు' డని సన్న పేయగ, నా భువనసుందరి తలంచిన మాత్రమున నత్యంత ప్రకాశముతో సుదర్శన చక్ర మామె కరమున జేరగ, దానితో నామె తటాలున వాని శిరము ఖండించె. వెంటనే యతనిశిరము సర్పశీర్షమయ్యెను. వెంటనే యాతడు పగతో సూర్య చంద్రుల మ్రింగబోవగ, బ్రహ్మ వారిని నుభయపర్వము లందు వారిని గ్రసియించునట్లు విధింప నతడు సమ్మతించి మిన్నకుండె. ఎంత వారికైన నకారణముగ దగని వైరము బెట్టుకొనిన, దత్ఫల మనుభవింపక తప్పదు.

# 7

అంత దానవు లీ మటుమాయలాడివలన నింత గగ్గెనపడి యా జగన్మోహిని దైత్యులందఱు చుట్టుముట్టగ, నా సుందరి శంఖ చక్రములు గల శ్రీహరి రూపము నొంది, యదృశ్యుడయ్యెను. శ్రీహరియొక్క యదృశ్యమును జూచి, పట్టరానికోపమున బలిచక్రవర్తి ధనుర్బాణాద్యాయుధములు ధరించి దేదీప్యమాన రథమున యుద్ధసన్నద్ధుడయ్యెను. చతురంగ బలములతో, పటహ శంఖాది వాద్యములతో సకలసేనలుగూడి రాక్షసులు జయించు గాంక్షతో దేవేంద్రుడైరావతము నెక్కి, దైత్యుల గదిసెను. ఆత్తరుణమున జగంబంతయు దానవమయంబయ్యెను. దేవతాసమూహమునకా సమయమున ప్రళయము సంభవించినటులుండెను.

బలి, పాక, జంభ, నముచి, విప్రచిత్త్యాది దైత్యవీరు లా సమయమున సమస్త జలభూచరము నారోహించి, పరశు, పట్టిస, తోమర, ప్రాసముఖ శస్త్రములు ధరించి, దుర్వారశక్తితో జేరి, బారులుదీఱి మ్రొక్కగ వారల జూచి, బలిదైత్యేంద్రుడు "వీరులార! చూచితిరా, వేల్పులను నమ్ముటవలన నెంత మోసమయ్యెనో. అబ్బా, శ్రీహరి యాడుదానివలె వచ్చి, మనలను భ్రమియించి, యమృతంబునంతను దేవతలకే పంచియిచ్చె.

జగదీశ్వరుడే యటుల హెచ్చరించెను. ఇంక మనకు విచారమేల? అతనిచేత మనలను మోసగించెను గాన నే నమరుల నెల్ల మట్టుపెట్టెదను. నా యాయుధములు వాడితేరి యుండగా" అని పల్కెను.

ఆ వాక్యములు విని, దైత్యులుత్సాహించి, "స్వామీ, సర్వదేవతలను మేము చంపివేయుదుము. బంధించి చెరసాలయందుంచుదుము. సెలవి" మ్మని యడుగగా, దైత్యేంద్రుడైన బలి మిగుల సంతసించి, "మీ యనుపమ భుజశక్తి తెలిసినదియే సమయ"మని దానవుల నందరిని పనుపగా, వారు రోషాగ్నులొలుకగ, నాయుధ కాంతులొలుక, దేవసైన్యము గదిసి, వివిధాస్త్రములను దేవతలపై ప్రయోగింప, నమరులు దానవుల శరాదులను ఖండించి వారితో నుత్సాహముతో నతి భీకర ద్వంద్వయుద్ధమొనర్చిరి.

బలి దేవేంద్రులు, వృషపర్వాశ్వినులు, రవి బాణులు, చంద్ర రాహువులు, విరోచనాగ్నులు, భద్రకాళీ నిశుంభులు, కాలనాభ వాయువులు, మయ విశ్వకర్మలు, జంభవృషాకపులు, [illegible] నామదేవులు, నముచ్యపరాజితులు, పులోమ నిఋతులు, మేఘ దంభావనితనయులు, కాలకేయ మిత్రులు, కమలమిత్రతనయ నరకాసురులు, నివాతకవచ [illegible]లు మున్నగువారల ద్వంద్వయుద్ధము లతిభయంకరము లయ్యెను.

దానవేంద్రుడగు బలికిని సమరేంద్రుడగు దేవేంద్రునకు జరిగిన దారుణ ద్వంద్వయుద్ధమున సముద్రప్రాంతము ఘూర్ణిల్లెను. అమృతసేవయు హరి కటాక్షమును గలిగిన యాఖండలున కెదిరి బలిదైత్యేంద్రుడు నిలువలేకుండెను. దేవేంద్రు డాగ్నేయాస్త్రము ప్రయోగింపగా దైత్యేంద్రుని మహారథంబు భగ్గున మండిపోయె. అంతట నాతడదృశ్యుడు కాగా నానా దైత్య సమూహము కటకటంబడెను. అతిశయ ప్రమోదమున నమరులు విజృంభించిరి.

అంతట బలిదైత్యేంద్రుండు లోచనాగోచరుండై తన నేర్పు మెఱపి, మాయావియగుచు నెల్లెడల, దోచి, పెల్లుగ నాక్రమించెను మాయగావించగ, దిక్పాలకులు మిగుల శ్రమనొందిరి. పెక్కు ఘాతములు దేవతల పీచమడచె. దిక్పాలురే యననేల? బలి మాయాప్రయోగంబున బ్రహ్మాదులును నెట్టబడిన మెదలగాజాలకుండిరి. కలశాంబోనిధి యందు దమ్ము ముంచినట్లు మాయ క్రమ్మగ దేవేంద్రాదులు మిగుల భయమంది 'పాహి, పాహి' యని మొఱవెట్టగ, క్షణములో హరి పాంచజన్యరవము వినవయ్యె. సుదర్శనచక్రము కనుపించె. హరి ప్రత్యక్షమాయె. బలి మాయ పటాపంచలయ్యె.

అప్పుడు కాలనేమి శ్రీహరిపై శూలమును ప్రయో

గింపగ, న ద్దేవదేవుడా యాయుధమును ద్రుంచి, దేవతలు మెచ్చునట్లు వాని తల ద్రుంచెను.

మాల్యవంతుడు గద దీసికొని గరుడునిపై ప్రయోగింప దేవేంద్రుడు తన వజ్రాయుధమును, హరి తన చక్రమును నేయగ. చక్రంబున సుమాలి యను నా మాల్యవంతుడు మడిసె. శ్రీహరి తన చక్రంబున మఱియు ననేక దనుజుల దునుమాడెను.

అంత దేవేంద్రుం డైరావతంబునెక్కి వజ్రాయుధమును ధరించి, బలిని జేరంబోయి, ప్రల్లదము లాడగ, బలి కుమారుడు ప్రతిప్రల్లదములాడెను. అంతలో బలి "సుర లోకేంద్రుడు వీరాధివీరుడౌట నాత డెన్నడైన నోడిపోవునే? కాని మొన్న నూరక నాకు స్వర్గాధిపత్యమిచ్చి,తా నడవులకు బోయెను మఱల వచ్చి నాతో నెయ్యమొనర్చి, న న్నాశ్రయించుకొని బ్రదికెను. కావున నేడు నే నోడినను నన్నెవ్వరును నవ్వరు. కర్మానుసార మాపదలు, సంపదలు, జయాపజయములు కల్గును. కాన దైవకృత్యములకు చిత్తి వీగుట వెఱ్ఱితన" మని పలికెను.

బలి యను నొకదైత్యుడు దురాగ్రహావేశంబున దేవేంద్రుని కయ్యంబునకు బిలువగ, న ద్దేవనాయకుం

దానిపై వజ్రాయుధము నేయ, నబ్బలి మూర్ఛితుండై రథసారథిచే నవలికి దీసికొనిపోబడెను.

తన మిత్రునకు గల్గిన దురవస్థ జూచి జంభుండు కడు విజృంభించి యైరావతముపై దన గదాదండంబు బిరబిర ద్రిప్పి వైచిన, నగ్గజరాజము పడిపోవగ, దేవేంద్రుడంత మాతలి తెచ్చిన సహస్రహయరథ మెక్కి, వజ్రాయుధమున జంభుశిరము దునిమె.

తద్వృత్తాంతమును నారద మునీంద్రునివలన విని, జంభసోదరులు బల, పాక, నముచు లాగ్రహించి, యమ్మువ్వురు త్రేతాగ్నులవలె దేవేంద్రుని జుట్టుముట్టి దారుణ శరములు ప్రయోగింపగ, బురుహూతుండు మేఘయుక్త మేరువువలె నొప్పారె. కాని యతని రథంబును బలుడును, హయములను పాకుడును, సూతుని నముచియును గూల్చి, యతని యంగకములు చించుటచే నద్దేవేశుడు మూర్ఛమునింగెను.

అనంతర మా బల, పాక, నముచిదైత్యులు విజృంభించి, యనలు, నంతకు, నసుర, నబ్ధిపు, ననిలు, నలకేశ్వరు, నలికలోచను, నన్యసురుల నతులితంబులగు నస్త్రంబుల నొప్పించి, యట్టహాసంబు చేయగ, దేవసైన్యములు మొఱలు పెట్టె, నంతలో నమరేశుడు తెప్పరిల్లి,

తన వజ్రాయుధంబున మొదట బలిదైత్యుని సంహరించెను. తరువాత బహుక్రమమున జంభాసురుని ద్రుంచెను.

అదిచూచి నముచి యత్యంత క్రోధమునొంది మత్త శాత్రవవిదారణ సమర్థమగు త్రిశూల మెత్తి, హుంకరించి వాసవునిపై బ్రయోగించెను. ఆ శూలంబు ప్రళయకాల రుద్ర ఫాలనేత్రాగ్నిచందంబున భయంకరంబై రాగ, నమరపతి దాని నేలంబడగొట్టి యద్దనుజపుంగవు కంఠనాళంబున వజ్రంబును ప్రయోగింపగ, నా దైత్యుండు కలంగకుండెను. వజ్రంబు దూసికొనిపోవలేక నిల్చియుండగ జూచి యమరు లచ్చెరువొంది చూచుచు వేడినిట్టూర్పు లూర్చుచుండిరి. అంతలో నాకాశవాణి "యార్ద్రంబును శుష్కంబును గానివానిచే నముచిదానవుండు తెగు" నని పలుకగ, నా సముద్రపేన మట్టిదని దానిని గ్రహించి, యా డిండీరమునకు దివ్య తేజంబు సంధించి, నముచిదైత్యునిపై బ్రయోగింపగ, నయ్యది సుపర్వాధిపతియగు దేవేంద్రుండు విజయ లక్ష్మికి సమర్పించు కర్పూరనీరాజనంబు చందంబున, ప్రకాశించునదై బలిదైత్య త్రిలోకాధిపత్య వినాశ సూచకంబై, నముచిప్రాణమును దీయు మృత్యుదేవతాట్ట హాసంబు కీర్తిని విరాజమానంబై, సురవిరోధి యగు నముచిశిరమును ఖండింపగ దైత్యవరూధిని యందు

హాహానాదంబు లుప్పతిల్లె. అమరచమూ సమూహంబులంను గాయక హాహానాదంబులు, బ్రహ్మర్షి సమూహ సముచ్చై రుచ్చారిత జయజయాద్యాశీర్వాదంబులు, జయ దుందుభి ధ్వానంబులు నచ్చరాంగనల నటనంబులుం జెలంగె.

ఆ సమయంబున క్షీరాబ్ధితీర యుద్ధరంగంబున నెచట జూచిన నెత్తు రేఱులై పాఱెను. కండలు కుప్పలు కుప్పలై కొండలవలె నుండెను. ఆ మాంసకండలకై భూత భేతాళ సమూహములు పోరుచుండగ, గరము భీభత్సముగ నుండెను.

యుద్ధమున గూలిన వీరుల మెదళ్ళు ముద్దలు గావించి మెసవి మెసవి, తనివిదీర నెత్తురులు గ్రోలి గ్రోలి, కడుపులు నిమిరికొంచు, భుక్తాయాసమున సత్వర జీర్ణమునకై యగస్త్య మంత్రములు చదువుచు, శత పదంబులు నడచుచు, పిశాచగణము గానవచ్చెను.

తుందిలుడగు నొక దనుజుని శవమున కొక గజ మస్తకంబు నతికి, 'యిందు విఘ్నములచే గుందింపకు' మని భూతగణములు మ్రొక్కుకొనుచుండెను.

ఒక కామినీభూతము 'వారు వేలుపులు వీరు దనుజు' లనుచు భూత భేతాళపంక్తి నేర్పఱచి తాను మోహిని యంచు రక్తసుధను వారలకు వడ్డించెను.

గజముల గండస్థలములనుండి స్రవించుచు మద జలము యమునానదీ కల్లోలములను, నిశాచర రక్తంబు సరస్వతీనదియును, మృతుల నోటినుండి వెలువడు లాలజలములు సురనదియు గాగ, నా దేవ దానవ సంగరభూమి త్రివేణీపుణ్యక్షేత్రమువలె నొప్పారె. గాన నా క్షేత్రంబున నిహతులైనవారికి మోక్షంబు ప్రాప్తించు.

ఏవం ప్రయుద్ధము సేయ దనుజవిభులును, దక్కిన రాక్షసులును దల్లడిల్లుచు సమరరంగమునుండి పలాయన మొనరించుచుండ, నమరగణములు వారిని వెన్నాడి ఫొడుచుచుండిరి. అహా! దాయాదిపోరు దుస్సహము కదా!

ఇవ్విధంబున సంకర్షణుని సుదర్శనచక్రంబున గాల నేమి, మాలి, సుమాలి, బల, జంభ, పాక, నముచి ప్రముఖులును, దానవవరులును, సేనాధిపతులును దిక్పాలకులవలనను ద్రెళ్ళుగ జూచి; దేశకాల విశేష విజ్ఞాన విచక్షణుండుగావున బలి దానవేంద్రుండు తన కది విజయంబు కాదుగదా యని యెఱింగి; సంగరరంగబు దొరంగి; శుక్రాచార్య సన్నిధికేగి వానివలన సంజీవినీ విద్యను; దత్ప్రోపదేశ వాక్యవిశేషంబులను దెలిసికొని, బాహ్యాంతఃకరణ దుఃఖంబుల బాపి తపంబునకుం జనియె.

తక్కిన రక్కసులు దిక్కులేక, పెక్కు వగల జిక్కి నానాదిక్కులకు పలాయనులు కాగా, దేవసేనాపతులు వెన్నంటగ వెఱచువారును, 'రక్షింపుడు రక్షింపు' డని యార్తనాదంబులు సేయువారును దెసలు దాటిపోవువారును, తృణంబులు గఱచువారును, నరణ్యంబుల జొచ్చువారును, పడి దూఱువారును, మ్రొక్కువారును, పర్వతంబుల నెక్కువారును, నొచ్చువారును, సముద్రంబుల జొచ్చువారునునై కలంగిరి.

# 8

అంత హిరణ్యగర్భుడు పంపగ, నారదమహర్షి యా యుద్ధభూమి కేగుదెంచి "ఓ యమరులారా! శ్రీహరి ప్రసాదమున మీ యభీష్టములు దీఱె. కాన నింకను భీతులగు దైత్యుల నొంపనేల?" యని వారల పోరు మాన్పెను. ఎవరికైనను పితృవాక్యము మీఱరానిదిగదా!

అంత నమరేంద్రుం డవార్యశౌర్యంబున రాత్రించర గర్వంబు తొలగించి, పాఱిపోవు నానాదానవుల ప్రాణముల రక్షించుచు, గంధర్వులు పెక్కుభంగుల నభినుతింప, విజయలక్ష్మీ సమేతుడై, యైరావతము

నధిరోహించి. సర్వామరులు సేవింపగ. నింపుసొంపు లమరగ, మహావైభవంబున నమరరాజధానియగు నమరావతీ నగరమున కేగె.

ఈ కూర్మావతార చరిత్రమును మనంబు శ్రీహరి పాద సరోజములందు నిల్పి. భక్తిమీఱ వ్రాయునట్టియు చదువు నట్టియు మనుజులు సకలైశ్వర్యంబులను దీర్ఘాయుః కీర్తులను గల్గి సుఖంబులందుదురు" అని వైశంపాయనుండు జనమేజయ మహారాజునకు కూర్మావతార కథను వినిపించె.

శ్రీ కూర్మావతారకథ సంపూర్ణము.